## చా వు

కలలో దగ్గరి బంధువులో, మిత్రులో చనిపోవటం కన్పిస్తే మీకు బాధలు కల్గుతాయి. పసిపిల్లల చావు కలగంటే మీ కోర్కెలు ఫలించవు. చనిపోయాక తీసిన ఫోటోలు, లేక చనిపోయినట్లున్న చిత్రాలు కలలో చూస్తే మీ కష్టాలు తీరిపోతాయి.

## శ వ పే టి క

కలలో ఖాళీ శవపేటిక కన్పిస్తే మీ భావి జీవితాన్ని గురించి ఆరాటం కలుగుతుంది. శవం వున్న పెట్టెను కలగంటే మీ వృత్తి వ్యాపారాలలో కష్టాలు ఎదురవుతాయి. కుటుంబంలో కలహాలు వస్తాయి. ఆ పెట్టెలోని శవం మీరే అయినట్లు కన్పిస్తే వృత్తి వ్యాపారాలలో అంతులేని లాభాలు, ఆదాయాలు, కుటుంబంలో శాంతి లభిస్తాయి. శవాన్ని పాతిపెట్టే చోటు కన్పిస్తే మీరు అన్ని విషయాల్లో జాగ్రత్తపడాల్సి వస్తుంది.

## శ్మ శా న ం

కలలో శ్మశానాన్ని చూస్తే మంచి కలుగుతుంది. అందులో మీరు వున్నట్లు చూస్తే మీ ఆప్తులు ఎవరన్నా చనిపోవచ్చు. శ్మశానంలోకి పూలతో వెళ్ళితే ప్రేమించిన వారితో కలయిక లభిస్తుంది. చిన్న పిల్లలు శ్మశానంలో పూలతో ఆడుకొంటున్నట్లు కలగంటే మీకు వుజ్జ్వల భవిష్యత్తు వుంటుంది.

## మూ ర్ఛ

మీరు మూర్ఛపోయినట్లు కలవస్తే మీరు జాగ్రత్తగా ప్రవర్తిం

చకపోతే కష్టాలు వస్తాయని గ్రహించాలి. ఎవరైనా యువతి మూర్ఛ పోయినట్లు కలగంటే మీరు దగాకోరు స్త్రీ చేతిలో చిక్కుకుంటారు.

సమాధి

కలలో తల్లి సమాధిమీద పుష్పాలు వుంచినట్లు కన్పిస్తే మీరు బాధలను ఓర్పుగా సహించవలసి వుంటుంది. తాజ్‌మహల్ లాంటి అందాల సమాధిని చూస్తే మీ పాత మిత్రుడు చాలాకాలం తరువాత మిమ్మల్ని చూడడానికి వస్తున్నాడని గుర్తు. సమాధి మీద మీ పేరు కలలో కన్పిస్తే మీరు మీ ఆరోగ్యాన్ని కాపాడుకోవాల్సిన అవసరం వుంటుంది. సమాధి కూలిపోయినట్లు కలవస్తే కుటుంబం సభ్యులలో ఎవరికైనా సుస్తిచేయవచ్చు.

మొటిమ

మొహంపై అక్కడక్కడ మొటిమలు వున్నట్లు కలవస్తే మీలోని లోటుపాట్లు మీకు తెలుస్తాయి. మరొకరి మొహంపై మొటిమ వున్నట్లు కలవస్తే మీ బంధుమిత్రుల కుట్రలు మీకు తెలుస్తాయి. అందమైన అమ్మాయి మొహంపై వున్న ఒకే ఒక మొటిమ అందంగా మీ కలలోకి వస్తే తీయని ప్రేమలో పడతారు.

ఉలిపిరి కాయ

మీ కలలో ఉలిపిరి కాయలు మొటిమలవలెనే కన్పిస్తే మొటిమల ఫలితాలనే అన్వయించుకోవాలి.

## కషాయం

కషాయాన్ని త్రాగినట్లు కలవస్తే మీ సంపాదన పెరుగుతుంది. మీరు ఇతరులకు కషాయాన్ని త్రాగటానికి యిచ్చినట్లు కలగంటే ఇత రులు మీకు సహాయం చేస్తారు.

## గూనివాఁడు

కలలో గూనివానిని చూస్తే మీ ఆదాయం పెరుగుతుంది. అత నితో ముచ్చట్లు పెట్టుకొన్నట్లు కలగంటే లాటరీ, రేసు, జూదాలలో అధిక లాభాలు వస్తాయి. మీకు గూనివచ్చినట్లు కలవస్తే మీ ఆరోగ్యము కుదుటబడుతుంది.

## గ్రుడివాడు

మీరు గ్రుడ్డివారైనట్లు కలగంటే మీరు మూర్ఖంగా ప్రవర్తించి ప్రమాదాలు కొనితెచ్చుకొంటారు. అతడు కలలో కన్పించినా, అతనికి దారి చూపినట్లు కల వచ్చినా అనుకోని విధంగా మీరు కార్యసాధన గావించి లాభం పొందుతారు.

## చెవిటివాడు

మీకు చెముడు వున్నట్లు కలలో కన్పిస్తే మీ చిక్కులు తీరు తాయి. చెవిటివారితో మాట్లాడినట్లు కలగంటే మీ గొంతెమ్మ కోర్కెలు నెరవేరకపోయినా చిన్నచిన్న ఆశలు ఫలిస్తాయి.

## నత్తివాడు

స్వప్నంలో నత్తివాడు కన్పించినా, అతడితో మాట్లాడినట్లు కలగన్నా, మీ బంధువులవల్ల మీకు కష్టాలు వస్తాయి. మీరు నత్తి

వానిగా మారినట్లు కలవస్తే, సభలు, సమావేశాల్లో మీరు గౌరవింప బడతారు.

## వి క లాం గు డు

అంగవైకల్యం కలవారు మీకు కలలో కన్పిస్తే మీవల్ల యితరులకు సహాయం లభిస్తుంది. మీకు అంగవైకల్యం కలిగినట్లు కలవచ్చినా ఇదే ఫలితం.

